# గోలకొండపత్రిక

చిత్రభాను సం॥ర నిజ జ్యేష్ఠ బ॥ ౧ సోమవారము


## తబ్రూకు పతనము

మన మిత్రవర్గానికి ఇంకామంచి దశరాలేదు. వారిదురదృష్టం ఇంకా అంతమొందనట్లుకానవచ్చుచున్నది. లిబియారంగమును ఒకసంవత్సరమునుండి గమనించుచున్నాము- గతసంవత్సరం వర్షాకాలములో జర్మనులు పైచేయిగా ఉండిరి. లిబియాలో రంపపుయుద్ధము జరుగుతూ ఉండింది. కొన్నాళ్ళు మనవారు ముందుకువెళ్ళేది. కొన్నాళ్ళు మనశత్రువులు ముందుకువచ్చేది. ఇదిగో తబ్రూకును పట్టుకొంటామని జర్మనులు ప్రగల్భాలు కొట్టడం. మరికొంతకాలములో వెనక్కు ఉరకడం. మళ్ళీముందుకు సాగిరావడం. ఈవిధంగాజరిగి తుదకు చలికాలములో జర్మనులబలము తగ్గిందనివిన్నాము. లిబియాలోని జర్మనుసేనానియగు రొమ్మెల్ గారిపని అయిపోయిందనివింటిమి. అతడు జర్మనీకికూడా కొన్నాళ్ళు వెళ్ళిపోయినాడేను. వారుతిరిగివచ్చినప్పుడు వారిసైన్యాన్ని వారిఆయుధాలను మనవారుకొంత పట్టుకొన్నిరి. ఈయెండకాలములో వారిని చాలాదూరము మనవారు తరిమివేసిరని వింటిమి వారికి లిబియాలో ఇకకొద్ది స్థలమే మిగిలిందనిన్నీ వారుపారిపోవచ్చును లేదా నాశనమవుతారు లేదా మనకు సంపూర్ణముగా లొంబడిపోతారు అనిన్నీ మనమువింటిమి. ౨౦ దినాలక్రిందటనే మనబ్రిటిషు ప్రధానమంత్రిగారగు చర్చిలుమహాశయులు బ్రిటిషువారి విజయము స్థిరమనిచెప్పి బ్రిటిషుసేనకు అభినందనాలుకూడా పంపిరి. పంపిన వారముదినాలలోనే రొమ్మెల్ కుయుక్తులకు ప్రారంభించెను. మోసముచేసి మిత్రమండలివారి సైన్యాన్ని కొంతపట్టుకొనెను. కొన్నిటాంకులను నాశనముచేసెను. కొన్నిపట్టుకొనెను- అక్కడినుండి యుద్ధముపూర్తిగా తిరుగుమొగముపట్టెను. ౧౦ దినాలలోనే రొమ్మెల్ సేనాని తనసైన్యాలతో ఒత్తుకొనుచు మీదికివచ్చెను. దినము ౧౫, ౨౦ మైళ్ళవేగములో ముందుకునడిచెను. తుదకు తబ్రూకురేవుపట్టణము మీదికి వస్తున్నాడని అనుకొంటుండగానే రానే వచ్చెను. దానిలో ప్రవేశించనేప్రవేశించెను. తబ్రూకుసేనలు లొంబడిపోయెను. తబ్రూకు జర్మనువశమైనముచ్చట రేవులోని ఓడలలోనివారికే తెలియకుండెనట- జర్మనుటాంకులు సముద్రతీరములో పారాడడంచూచి వ్యవహారం తలక్రిందైనదని గ్రహించివలాయనంచిత్తగించినారట ౨౫ వేల ఖైదీలను చాలా ఆయుధాలను జర్మనులు పట్టుకొన్నామని చెప్పుచున్నారు. దీనితో లిబియారంగము ముగిసెను.

ఈతబ్రూకు పనికిరానిదనిన్నీ లిబియాయంతయు పనికిరానిదనిన్నీ యుద్ధతంత్రప్రవీణులన్నారు. అట్లైతే దీనికైయింతఅవస్థ పడినదెందులకు? లిబియాదేశములో ఎట్లైనాసముద్రతీరమందుండే కొన్నిపట్టణాలే ఉపయోగమైనవి- తక్కిన దేశమంతాఎడారిమయము- ఘోరమైనఉష్ణముకలిగి ఇసుకతుపానులు ఎల్లప్పుడుచెలరేగే ప్రదేశము- ఈలిబియా సముద్రతీరపట్టణాలకొరకే యీలిబియా రంగప్రాముఖ్యతకనబడుచున్నది. ఈపట్టణాలు మనఇంగ్లీషువారివశములో ఉండుట చాలాఅవసరము- మధ్యధరాసముద్రపటమునుచూచిన వీటిప్రాముఖ్యత కానవచ్చును. అటుఇంగ్లాండు, ఇటుఇండియా మధ్య ఈజిప్టు, సూడాన్ దేశము, అబిసీనియా దేశములున్నూ ఉన్నవి. వీటిరక్షణ చాలాఅవసరము. అందుచేతదూరదృష్టికల మనఇంగ్లీషువారు ఇండియారక్షణకును, ఆఫ్రికాలోని తమఅధీనదేశాలరక్షణకును, ఏడన్, సూయజుకాలువ, మాల్టాద్వీపము, జిబ్రాల్టరుఅగ్రము, ఇవన్నితమవశములోనుంచుకొని యుండిరి. ఇవన్నింటినిబలిష్ఠముగారక్షించుకొనియున్నారు- ఇంతగొప్పయుద్ధమైనను జర్మనులెన్నిరంగాలలో ఎన్నిపల్టీలుకొట్టినా సూయజుకాలువను జిబ్రాల్టరును సమీపించేధైర్యములేనివారైనారు. వారు ఇంచుమించు ౧౫౦౦మారులు మాల్టాఅను చిన్నద్వీపముపై విమాన దండయాత్రలుచేసిరి. బాంబులవర్షముకురిపించిరి. ఇన్నిమారులు దండయాత్రలనుచూచినస్థలము ప్రపంచములోమరెచ్చటనులేదు. అయినను మాల్టాలో వారు కాలుపెట్టలేకున్నారు- మాల్టాకంటే ఎన్నోరెట్లుఅధికంగా పెద్దదైన క్రీటుద్వీపాన్ని ౧౦ దినాలలోఆక్రమించుకోగలిగిన జర్మనులు మాల్టాను సమీపించలేకపోయినారు.

ఇప్పుడు తబ్రూకుపతనంతో పరిస్థితులలో ప్రమాదంపర్పడే సూచనలు కనుపించుచున్నవి. మాల్టాకుప్రమాదం కలుగవచ్చును. మరిమధ్యధరాసముద్రములో ఇంగ్లీషువారి ఓడలునిరాఘాటంగాతిరుగజాలవు. ఈజిప్టుదేశంకూడా ప్రమాదస్థితిలోనికివచ్చింది. అప్పుడేరొమ్మెలుసేనాని ఈజిప్టుదిక్కుండే బార్డియా అను సరిహద్దురేవుపట్నంపై కాలుసాచినాడు. అతడు ఉత్సాహమదోన్మత్తుడైనాడు. ఈజిప్టునుకాపాడే అత్యధికభారం బ్రిటిషువారిపైనఉంది- ఈమూడుదినాలలోనే రొమ్మెల్ సైన్యాలు ఈజిప్టులో ౧౦౦ మైళ్ళపొడవునఆక్రమించుకొన్నవి- ఈజిప్టు మనహిందూస్థానమువలెనే బ్రిటిషువారికి లొంబడినదేశము. అయితే గుడ్డిలోమెల్లగావారు మనకంటేమేలు. వారికికాస్త స్వాతంత్ర్యమిచ్చినారు. వారి అంతరంగికపరిపాలనములో చేయిచేసుకొనుటను ఇంగ్లీషువారు కొన్నియేండ్లనుండిమానుకొన్నారు. ఆమాత్రముస్వాతంత్ర్యమునుచూచుకొని ఈజిప్టువారు మేము తటస్థులమనియుద్ధములోచేరకుండా ఉన్నారు. అయితే ఈజిప్టువారికిస్వతంత్రసేనలేదు. ఈకాలంలోయుద్ధానికి కావలసిన ట్యాంకులు, విమానాలు, వారికిచాలాతక్కువ. అందుచేత ఈజిప్టునురక్షించుభారం మళ్ళీమనఇంగ్లీషువారిపైననేపడింది.

ఈతబ్రూకుపతనంవల్ల ఇంగ్లీషువారి యుద్ధతంత్రాలలో మార్పులుచేయవలసివస్తుంది. ఈజిప్టురక్షణంలో మగ్నులగుటచేత యూరోపులో రెండవ "ఫ్రంటు" (సేనాముఖమును) స్థాపించుటలోకొంత ఆలస్యమగునేమో. ఇంగ్లాండుదేశములో పార్లమెంటుసభ్యులున్నూ, ప్రజలున్నూ, పత్రికలున్నూ తబ్రూకుపతనముపై పెద్దగోలచేయుట కారంభించినారు. ఇందెవ్వరిదితప్పు! ఇదెట్లుశత్రువులవశమయ్యెను! ఈఅపజయములకు నేరమెవ్వరిది? అపరాధులను ఘోరముగా ఎందుకుశిక్షింపరు! యుద్ధతంత్రములోనే పూర్ణంగామార్పుచేయవలసివస్తే మొందుకుచేయరు? ౨౦దినాలనాడు శత్రువును లిబియాలో సర్వనాశనం చేయుచున్నామని మాకునమ్మకం కలిగించితిరే. ఇంతలోఇంతవింతయెట్లు జరిగెను! కానీ ఇప్పుడు అమెరికాలో రూజువెల్టుసభాపతిగారితో సకఘాటిగా ఆలోచనలుచేస్తుండే చర్చిలుమహాప్రధానిగారు రానీ వారినినిలదీసి అడుగుతాము. అని అన్నిదిక్కులా కేకలు వేయుచున్నారు. ఇదిసహజమే. ఇంగ్లీషురాజనీతిజ్ఞులు సామాన్యులుకారు. వారు అపజయాలకు బెంగపెట్టుకొని లొంగిపొయ్యేవారుకారు. వారిదిగట్టిగుండె సట్టుదలఆజాతిలోని నైజగుణము. బ్రిటిషురాజ్యతంత్రజ్ఞులీసమయంలో ఇకముందిట్టిలోపాలు కలుగకుండా చేయగలరని విశ్వాసముమాత్రమందరికున్నది. తబ్రూకుపతనములో దక్షిణాఫ్రికాసైన్యాలున్నూ హిందూస్థానీసైన్యాలున్నూ నష్టమై ఖైదీ అయినవి- మరాటీల డి విజను జర్మనులకు ఖైదీఅయినది- పార్లమెంటులోని ఉపప్రధానియైన అట్లీగారు దక్షిణాఫ్రికా సభాపతియగు స్మట్సుగారికి వారిసైన్య విపత్తునకుగాను శోకపరామర్శనుచేసి సానుభూతిని పంపిరి- మరివారు హిందూస్థానానికిట్టి శోకపరామర్శ నెందుకు పంపకపోయిరి?

ఈసమయంలో హిందూస్థానములోని కాంగ్రెసుతో మరొకమారు సంప్రతించివారిని ఇంగ్లీషుప్రభుత్వవారు తృప్తిపరచితే బాగుంటుందని కొన్ని ఇంగ్లాండుపత్రికలు పలుమారు వ్రాసెను. కాని అమెరీమంత్రిగారికి ఒకేకోకటిపాట వచ్చును. వారు దానిశ్రుతిమార్చరు. ఆలాపనభేదముచేయరు. రాగముమార్చరు. సకలరోగసంజీవనిగా క్రిప్సుసూచనలు నిలచిపోయినవంటారు. అవి విస్మృతికాలపుమాటలని కాంగ్రెసు నేతలంటారు. ఇందూరుమహారాజావంటిగొప్పవారే రూజువెల్టుసభాపతిగారిని అయ్యా మీరైనా జోక్యంకలిగించుకొని మా వివాదాలు పరిష్కరించండి అని వారికి వ్రాసుకొనిరి- ఇంతవరకు సభాపతిగారు సంస్థానాధిపతిగారికి ప్రత్యుత్తరమియ్యకపోయిరి- ఈసమయంలో కాంగ్రెసున్నూ ముస్లింలీగున్నూ హిందూమహాసభయున్నూ అన్నిఏకమై తృప్తిపడినవైతే ఇంగ్లీషువారికిసగమువిచారముమటుమాయమైపొయ్యేడిదని చాలామంది నాయకుల అభిప్రాయము- ఏదియెట్లున్నాహిందూస్థానములో బలవంతపు సైనికశిక్షణ (కంస్క్రిప్షన్) ౧౮ఏండ్లనుండి ౪౦ ఏండ్లలోని పురుషులకంతా ఇచ్చి వారికి ఆయుధాలుయిచ్చిచూడండి ఒకసంవత్సరముపాటుగట్టిగా ఈశిక్షణజరిగితే ఇటు జపాన్ అటుజర్మనీ నేలగూలిపోగలవు- కాని బలవంతపుసైనికశిక్షణ భారతదేశ స్వాతంత్ర్యముతో కాదగినట్టిది. అదిలేకుంటే ఇదిలేదు- రెంటికి అవినాభావసంబంధమున్నది- మంచికాలమంతయు వృధాపోవుచున్నది- ఇంతవరకే రెండేండ్లు వ్యర్థముగాపోయెను- ఈ రెండేండ్లలో భారతదేశము ఎంతయో సిద్ధమైపోయియుండెడిది. ఇకముందెట్టిఅవకాశములున్నవో ఇంగ్లీషువారికే తెలియవలెను-

రుమ్మెల్ దృష్టి అలెగ్జాండ్రియాదిక్కున్నవి- అప్పుడే మర్సామత్రూ సమీపించినాడు- దానికి ౨౦౦మైళ్ళదూరములో అలెగ్జాండ్రియాయున్నది- అప్పుడే సిరియాపాలస్థానములోనిజ్యూలకుతహతహయేర్పడింది- వారు అందరిని బలవంతంగాసైన్యంలోభర్తీచేయుచున్నారు. ఇకముందుసిరియా ఈరాన్ రాష్ట్రాలపైకి రొమ్మెల్ వస్తాడని వారిభయం- ఇదంతా ఇండియాకు ముప్పే!

## స్థానిక వార్తలు

హైదరాబాదు దక్కన్ నగరములో సీతారాంబాగు సంస్కృతపాఠశాల ఈనిజజ్యేష్ఠ శుద్ధ౫నుండి ప్రారంభించబడినది- పాతవిద్యార్థులు వెంటనే చేర్చుకోబడుదురు- నూతనవిద్యార్థులకు ఇరువదికి మాత్రమవకాశమున్నది. ఈఆషాఢశుక్ల ౫లోపలవచ్చినవారినిమాత్రమే చేర్చుకొనెదరు

... ...

జొన్నలు, బియ్యము రాష్ట్రములో ఎక్కడెక్కడ ఎవ్వరెవ్వరివద్దయెంతఉన్నదో తెలుసుకొని తక్కువవుండేవాటిని ఎక్కువగామార్చుటకుప్రయత్నం చేయవలసినందున హైదరాబాదు ప్రభుత్వంవారీ క్రిందివిధముగా ఆజ్ఞాపించినారు-

"ఎవ్వరెవ్వరివద్ద(౧)౨౦తూకంపల్లాల జొన్నలకంటె అంతకంటేఎక్కువఉన్నదో ౧౦పల్లాలకంటె అంతకెక్కువబియ్యమున్నదో ఈమొత్తము తమదికాని లేకయితరులదికాని అయినను ఎవరివశములోఉండినను వారు జిల్లాలలో ౧౫ ... వారేదన ౧౩౹౧౫ లోగా తహసీల్దారు వద్దనున్నూ, హైదరాబాదునగరంలో అధికకార్యదర్శి భూమ్యాదాయశాఖ వద్దఎంతధాన్యం నిలువఉన్నదో దానిసరియైన లెక్క తెలుపవలెను-అవసరంకనబడితే పైఅధికారులు తమకేను కేంద్రాలలో ఆస్థలాలనుపరీక్షించి తెలిపిన వార్తసరియా కాదా అని విచారించుకొనుటకు అధికారముకలిగియున్నారు- ఎవరైతే పైఆజ్ఞకు విరుద్ధముగా ఆచరించుకొందురో అట్టివారికి మూడేండ్లజెయిలుశిక్షయున్నూ పైగాఅపరాధద్రవ్యముగూడ విధింపబడును-

... ...

కుర్బానీబ్రత్యక్షనుం దేశంగ్లీషుశాలాకాలోను ఆందోళనకాలాకాలోను కలరాఉన్నందున పై రెండుస్థలాలలో జరుగబోవు ఉరుసులు స్థానికముగామాత్రమేఉండునని ప్రభుత్వమువారు ప్రకటించినారు-

... ...

హైదరాబాదు ప్రభుత్వమువారిట్లు ఆజ్ఞాపించినారు-"జిల్లా మొదటితాలూక్దారు సెలవులేనిదియెవ్వరును రాష్ట్రమునుండిబయటికి చక్కెరను ఎగుమతిచేయరాదు- ప్రయాణికులుతమప్రయాణ అవసరాలకుమాత్రమేతీసుకొనిపోవుచక్కెరకు ఇదివర్తించదు-వారున్నూ౫సేర్లకంటె ఎక్కువగాఎవరున్నా తీసుకొనిపోగూడదు- దీనికివ్యతిరేకంగావర్తించువారికి ౩ఏండ్ల జెయిలుశిక్షయు జుర్మానాయు విధించబడును-

... ...

హైదరాబాదు వై-యం-సీ-ఏ-లో ౨౬జూను శుక్రవారంసాయంకాలము మహవీరయ్యాదుఅబ్దుల్ హాఫీజ్ ఎఫ్-కే-యాన్-గారు సర్వమతసామ్యతఅను విషయాన్నిగూర్చి ఒకగంటకాలముపన్యసించిరి-అన్నిమతాలలోని ముఖ్యమగునీతులు, ధర్మాలు ఒకేవిధమైనవనియు దేశకాలములబట్టి ఆచారములలో భేదముండునేకాని మూలసిద్ధాంతము లందుభేదనియు వారియుపన్యాససిద్ధాంతమైయుండెను- సురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షతవహించియుండిరి-వారును అదేవిషయాన్ని బలపరచుచు అనేక నూతనవిషయము లైతిహాసికములనుప్రకటించి సభ్యులనానందింపజేసిరి-ఉపన్యాసములుఇంగ్లీషులోజరిగెను-కార్యదర్శిగారగు ... గారుఉభయులకు కృతజ్ఞతను వెల్లడించిరి.

... ...

## లాలాగూడా రైల్వేహద్దులు

హైదరాబాదుప్రభుత్వవశమైనవి

గతవారము సికింద్రాబాదులాలాగూడాలోని రైలుహద్దులన్నియు హైదరాబాదుప్రభుత్వానికిఅప్పగింపబడినవి_లాలాగూడ, మెట్టుగూడాబిలకలగూడాలోనిరైలులైనుతప్పతక్కినభాగములన్నియు హైదరాబాదుప్రభుత్వానికి బ్రిటిషుప్రభుత్వమువారిచ్చివేసినారు. ఇదికొంతకాలంవరకువర్తించుననిఅనుచున్నారు-ఈ స్థలగూలలో హైదరాబాదురాష్ట్రశాసనములన్నియు ఇకమీదవర్తించును-

... ...

హైదరాబాదుసదరమిర్జాసర్దారుద్దీన్ ఖాన్ గారు ౧౫ఆమర్దాదునాడు హైఫాయిడ్ వచ్చి చనిపోయిరి-

... ...

నవాబహద్దరుయార్జంగుబ॥ గారు బెంగుళూరుకు ౧౫ఆమర్దాదునాడు ప్రయాణమైవెళ్ళిరి-

... ...

౧౯ఆమర్దాదునాడు సర్ టీ-జే-టాస్కరుగారికివీడ్కోలుపుటకుగాను నగర పోలీసువారు పేట్లాబుర్జువద్ద పరేడుచేసిరి-కొత్వాలుబహద్దరుగారు సర్ టాస్కరు గారికివిందిచ్చిరి- సర్ టాస్కరు గారు పోలీసు వారిశ్రద్ధనువారుచేయుచున్న సేవనుప్రశంసించిరి-పోలీసువారికిని ప్రజలకునుపరస్పరంగా సానుభూతి ఉండుట చాలాముఖ్యమని ఒత్తిచెప్పిరి.

... ...

వసంతరావుకేస్కరు గారికి జెయిలుశిక్షఅయియుండెను-శిక్షను పూర్తిగాఅనుభవించి విడుదలఅయినారు- వా. గౌరవార్థము హిందూప్రజామండలివారు వి-రామచంద్రరావుగారిఅధ్యక్షతలో సభచేసి వారిదేశసేవనుప్రశంసించి గౌరవించిరి.

... ...

హైదరాబాదు గృహపరిశ్రమల విక్రయశాలను హైదరాబాదుప్రధానామాత్యులుగారు గతమంగళవారమునాడు పరీక్షించి వారికి లేడీటాస్కరుకొత్వాలుకొత్వాలుబిల్డ...గారు అచ్చటి విక్రయవస్తువులనుచూచి చాలాఆనందించిరి-మెచ్చుకొనిరి-లేడీటాస్కరుగారికి ఈపరిశ్రమలపై చాలాశ్రద్ధయుండెను- వారికిజ్ఞాపకార్థమై వివరీపనిగలయొక సుందరమగువస్తువును పరిశ్రమలసంఘమువారు బహూకరించిరి-

... ...

జీవరక్షాజ్ఞాన ప్రచారమండలివారిట్లువ్రాయుచున్నారు-

హైదరాబాదు, సికింద్రాబాదు, బొలారం, లాలాబజారుల జీవసంరక్షణమును ... మనగా-

రాబోవుఆషాఢమాసమున జరుగబోవుజాతరలలో జీవహింసజరుగకుండుటకై, గతసంవత్సరముతామువేసినకృషిని తిరిగిచూపగలరనిప్రార్థన, దేవీపూజలుహింసాశూన్యములుగ, సాత్వికప్రసాధాన్యముతో నిరవేరునట్లుచూచుటధర్మ,వేయూ శీలురను తమకందరకును విధియైయున్నది-

ఇట్టికార్యములు, ధర్మసంస్థలు, దేవసేవకులు, భక్తులున్నగువారికృషితో సాధింపబడవలసినవి గాన ప్రతి భజనసమాజమువారును తమతమవాడలందు తగినప్రచారముచేసి జీవబలినినిలిపివ్యయసంచయము చేసికొందురనిమాఆశయము-

### ఆరువు, కోలు సహాయము

౧౯౪౨ మేనెలతో అంతమగువారములో అమెరికాసంయుక్తరాజ్యమువారు ౧౯౦ కోట్ల డాలర్లకుమించిన సహాయమును అరువుకోలు ఏర్పాటుక్రింద మిత్రమండలిరాజ్యాలకు పంపిరట_౧౯౪౧మార్చినుండి ౧౯౪౨ మేవరకు ౧౧౧౩ ఆలో ౪౪౯కోట్లకంటెఎక్కువడాలర్ల సామగ్రిలను పంపించిరట,ఇవుకుసంయుక్తరాష్ట్రముల వారికి యుద్ధసహాయంగా సంవత్సరానికి ౧౦౦కోట్లడాలర్ల సామగ్రిపంపబడుచున్నదట_అట్లేఅమెరికావారుపంపించుచున్నదానికిబదులుగా మిత్రమండలిరాజ్యాలు అమెరికాకుకావలసినదానిని యిచ్చుచున్నవట- ఆస్ట్రేలియాలోను బ్రిటనులోనుచేరియున్న అమెరికనుసేనలనివాసములు,భోజనము, ఆయుధసామగ్రిమున్నగునవి ఆదేశములవారలచే సమకూర్చబడుచున్నవట- అమెరికాలో ఉండుగుండుసామగ్రులనుతయారుజేయు పనిముట్లను మిత్రమండలివారుపంపించినారట- అమెరికావారికిముఖ్యమైనస్థానాలను బ్రిటీషువారు పంపిన విమానధ్వంసక శతఘ్నులతో రక్షించుచున్నారట-

### ౨౦౦౦ మందిహర్ ఖైదీలు

సింధురాష్ట్రములో ఇప్పుడు ౨౦౦౦మందికిమించిహర్ లు జైళ్లలోనున్నారు-సింధుజైళ్లన్నియు ఖైదీలతోనిండియున్నవి- ఆరాష్ట్రములోని హైదరాబాదులో ఈహర్ ఖైదీలనుంచుటకైఒకపెద్ద శిబిరము నేర్పాటుచేయుచున్నారు కరాచినుండిలాహోరుకు రాత్రివేళపోవు రైలుబండ్లప్రయాణము మరల ప్రారంభించబడినది-

## రష్యారంగములో కోటిమందినాజీలబలి

రష్యాజర్మనీలయుద్ధము మొదటి సంవత్సరములో రష్యాజర్మనీల నష్టాలనుగూర్చి [సోవియట్] ౨౨-౬ తేదినుదయం మాస్కో రేడియో క్రింది వివరములు ప్రకటించినది-

| | జర్మనీనష్టాలు | రష్యన్ నష్టాలు |
|---|---|---|
| సైనికులనష్టం [చనిపోయిన వారి గాయపడిన వారి లెక్కకురానివారిమొత్తం] | ౧,౦౦,౦౦,౦౦౦ | ౪౫,౦౦,౦౦౦ |
| ఫిరంగులు | ౩౦,౫౦౦ | ౨౨,౦౦౦ |
| టాంకులు | ౨౪,౦౦౦ | ౧౫,౦౦౦ |
| విమానాలు | ౨౦,౦౦౦ | ౯,౦౦౦ |

రష్యాయుద్ధరంగములో మరణించిన జర్మనుసైనికులసంఖ్యకనీసం ౩౫,౦౦,౦౦౦ గాయపడినరష్యన్ సైనికులలో నూటికి౭౫మంది స్వస్థతచెంది, తిరిగిరణరంగములో నిలిచినారు_గాయపడిన జర్మను సైనికులలోతిరిగియుద్ధరంగానికిరాగలిగినవారు కేవలంనూటికి ౪౫మందిమాత్రమే-

